


ఈ పేరు మీరు ఎప్పుడేనా విన్నారా అని నేను అడిగా ననుకోండి. వెంటనే మీరు 'ఓ.... లక్షన్నర సార్లన్నా విని ఉంటాం' అని అంటారు. తప్పకుండా వినే ఉంటారు!

తల్లులు తమ బిడ్డల్ని లాలిస్తో తరుచు 'నా బంగారు కొండా, ముత్యాల దండా' అని అంటూంటారు. బహుశా మీరు ఆ మాటను - ఒక లక్షన్నర సార్లేమిటి....కనీసం ఒక కోటి సార్లన్నా విని ఉంటారు.

కాని, అసలు సంగతి ఏమిటంటే - బంగారుకొండ పేరుతో ఒక పెద్ద కొండ ఉంది. మీలో ఎవరికీ దాన్నిగురించి

తెలీదు. మీకేకనక తెలిసిఉంటే నాకన్న ముందుగానే ఈ కథని చెప్పకలిగి ఉండేవారు.

బంగారు కొండ పేరు మొదటగా నా చెవిని పడ్డప్పుడు ఆశ్చర్యపోయాను. ఆకొండ రాళ్ళన్నీ బహుశా బంగారం ముద్దలు కాబోలనుకొన్నాను. కాకపోతే అలాంటి పేరు ఎలా వస్తుంది?

సరే! ఏమైనాసరే బంగారు కొండని ఒకసారి వెళ్ళి చూసి తీరాలనుకొన్నాను. అదెక్కడుందో, అక్కడికి ఎలా వెళ్లాలో నా కేమాత్రం తెలీదు. అక్కడికీ కొందరిని అడిగి చూశాను, బదులు చెప్పలేదు. పైగా నన్ను అదో లాగ చూశారు.

ఆఖరికో ఉపాయం తట్టింది. మా ఊళ్లో ఓ పేదరాసి పెద్దమ్మ ఉంది. ఇలాంటి రహస్యాలన్నీ ఆవిడకు తెలుసు. పెద్దమ్మ ఇంటికి వెళ్లాను. మొదట బంగారుకొండకు దోవ చెప్ప డానికి నిరాకరించింది. రేపు చెబుతా మాపు చెబుతా రమ్మని తిప్పేది. పదికి నూరుసార్లు తిరిగాను. చివరకి ఏమనుకుందో ఏమో బంగారు కొండ తీరుతెన్నులు చెప్పింది.

'పట్టుదల ఉంటే ఎలాంటి పనినైనా సాధించవచ్చు. నీలాంటి కుర్రవాళ్ళు నలుగురుంటేనా - ఎన్ని సాహసాలైనా జరుగుతాయ్!' అంది పేదరాసి పెద్దమ్మ నన్ను మెచ్చుకుంటో.

బంగారు కొండకు పోవడానికి ఒక దోవా డొంకాలేదు. ఎన్నెన్నో తిప్పలుపడి పోవాలి. ఎలా వెళ్ళానో అది ఇప్పుడు చెప్పడం అనవసరం!

ఓ నది వంపులో ఉంది బంగారుకొండ. నదిమీది వంతెన చాల పాతది. వంతెనదాటి నాలుగడుగులు వేస్తే కొండ. కొండ నిండా పొదలే! అంతా పచ్చటి పొదలే! దగ్గరగా వెళ్ళాను.

అక్కడ బంగారు ముద్దలులేవు సరికదా బంగారు వన్నె రాళ్ళయినా కనిపించలేదు. అన్నీ మామూలు రాళ్ళే! అంతా నల్ల రాళ్ళే : నేతి బీరకాయలో నెయ్యిలాగానే బంగారు కొండలో బంగారమూను. ఇంతదూరం వొచ్చి ఊరికే తిరిగిపోతే ఏం లాభం? ఓసారి చుట్టూ తిరిగి చూద్దామనుకొన్నాను.

ఇంతలో ఎదురుగానున్న పెద్ద రాతిమీద నా చూపు పడింది. ఏవో అక్షరాలు చెక్కినవి కనిపించాయి. రాతినిండా ముకిల పేరుకుని ఉంది. శుభ్రంగా తుడిచి బాగుచేశాను. అవి అక్షరాలే! కాని, అవి మనం రోజూ రాసే లిపిలో లేవు. పిల్లల స్వంతభాషకు సంబంధించిన లిపిలో ఉన్నాయి. నాకు వచ్చును, చదివాను.

## ఇదే వీథిగాయకుని మందిరం

వీథిగాయకు డేమిటి? అతగాడికి ఇక్కడ ఇల్లేమిటి? వీథి గాయకుడు వీథిలో ఉండాలి. ఇల్లు ఊళ్ళో ఉండాలి. అంతే

కాని ఇల్లు కొండమీద, వీధిగాయకుడు నదివొడ్డున ఉండడం వింతకాదూ ?

మొత్తంమీద ఇక్కడ అంతా ఎన్నో వింతలు ఉండి ఉండాలి. ప్రతిరాతినీ పరిశీలిస్తూ నడిచాను. దగ్గర్లో గుహలాగా ఒకటి కనిపించింది. పైన ఏవో అడవి తీగలు దట్టంగా అల్లు కొని చీకిరి బాకిరిగా ఉన్నాయి. వాటన్నిటినీ తెంచి చూశాను. నిజంగా అది గుహ. కాని ఇల్లులాగా తయారు చేశారు. తలుపు మూసి ఉంది. తలుపంటే రాతి తలుపే సుమండీ! తెరుచు కుంటుందేమోనని శతవిధాల ప్రయత్నించి చూశాను. ఊహుఁ. నాకేమో పాతాళభైరవి మంత్రాలు రావాయె! ఏం చెయ్యను ?

ద్వారబంధాల నిండా మకిలపట్టి నల్లకప్పేసివుంది. రెండు చేతులా గీకిగీకి పరిశుభ్రం చేశాను. అద్భుతం! ద్వారబంధాలు బంగారు వన్నెతో మిలమిల్లాడుతున్నయ్. నా ఆశ్చర్యానికి అంతూపొంతూ లేదు. అలాగే విసుగూ విరామం లేకుండా తలుపుకూడా తుడిచి శుభ్రం చేశాను. చేతికి ఏది అందితే దాంతో తెగరుద్దాను. ఆ నిమిషాన నేనెంత ఆశ్చర్యంలో మునిగి అట్టే ఆగిపోయానో స్వయంగా చూసినవారికే తెలుస్తుంది!

తలుపు మీద ఒక మనిషిబొమ్మ. పొడుగ్గా, చిత్రమైన దుస్తులు వేసుకొని మురళి వాయిస్తున్నాడు. అప్పుడే తీర్చి దిద్ది నట్టు కొట్టొచ్చినట్టుంది బొమ్మ. చిత్ర విచిత్రమైన రంగులు దిద్ది ఉన్నాయి. ఎవరిదీ బొమ్మ ? వీధి గాయకుని దేనా ?

ఔను. ఆ బొమ్మ దిగువన పిల్లల భాషలో ఇలా రాసి ఉంది.

ఓ వీథిగాయకా!

బంగారుపట్నం కోటీశ్వరులకు తిరుగు లేని,
మరపురాని గుణపాఠం చెప్పావు. ఈ ప్రపం
చంలో నీ కథ తెలిసిన వారెవరూ నిన్ను
మరిచి పోరు. పద్నాలుగు వందల యాభై
అయిదూ జూన్ ఇరవై ఏడో తేదీని మరిచిపోరు.
అమర గాయకా! నీకు మా జోహార్లు!

ఇట్లు,
నీ కుంటి తమ్ముడు వేణు,
వేణు తల్లి.

ఇదేదో వింతకథ! ప్రయత్నించి చూస్తే తెలియకపోదు. అలుపు సొలుపు ఎరక్కుండా ఆ గుహచుట్టూ వెతికాను. అను మానం తగిలిన రాతినల్లా తుడిచి శుభ్రం చేశాను. తుదకు నా శ్రమ ఫలించింది. వీథిగాయకుని వింతగాథ నాకు దొరికింది.

అది వింతగాథ కావచ్చు, విషాదగాథ కావచ్చు, మరే దైనా కావచ్చు. ఆ గాథ పిల్లల భాషలోనే ఉంది. అదంతా చదివాను. చదివి తెలుసుకొన్న ఆ గాథనే మీకు చెబుతాను. వినండి!

నదికి ఇవతల ఇప్పుడు గచ్చపొదలున్నాయి కాని ఐదు వందల ఏళ్ళక్రితం చాల చక్కని పట్నం ఉండేది. దానిపేరే బహు ముచ్చటయినది. 'బంగారు పట్నం.' పట్నం సరిహద్దులో నది, నది వొంపులో కొండ. ఎంత అందమైన దృశ్యం!

పట్నంలో ఒక్క కుటుంబం మినహా తతిమ్మావారంతా లక్షాధికారులూ, కోటీశ్వరులూను. వాళ్ళ వంటినిండా బంగారం, ఇంటినిండా బంగారం, తినే కంచాలు, పండే మంచాలు అన్నీ బంగారు వన్నెవే! ఎటుచూసినా బంగారం! మరి ఆ పట్నంలో రాజులూ మహారాజులే కాని పేదా సాదా పేరుకైనా ఉండరుకదా!

పట్నంలో వారానికి రెండు సంతలు జరుగుతుంటాయి. ఆ సంతలకి నలుమూలలనించి రకరకాల సరుకులు వచ్చేవి. అక్కడ దొరకని సరుకు ప్రపంచంలో మరెక్కడా దొరకనే దొరకదని వాడుక! సంతరోజున ఆ పట్న వైభవం చూడవల సిందే కాని చెబితే తీరదు!

పట్నానికి రాజువంటివాడు మంగళరాయుడు. కోటీశ్వ రుడు. మంచికీ, చెడ్డకీ అతనే పెద్ద. పట్నం నాలుగు వేపులనించి నలుగురు పెద్దల్ని సలహావార్లుగా ఎంచుకున్నాడు. వాళ్ళు అర్ధ కోటీశ్వరులు. ఈ అయిదుగురూ పట్నంలో చీమ చిటుక్కు మంటే చాలు ఒకచోట కూడతారు. ప్రజలనించి వసూలుచేసే లక్షలాది ధనం వాళ్ళే ఖర్చు చేస్తూంటారు.

మంగళరాయుడు నాలుగు గుర్రాల బగ్గీమీద ప్రతి సంతకి వస్తాడు. సంతలో మేలైన సరుకు అతనికే చేరుతుంది!

ఇక ఆ పట్నం ప్రజల రీతిరివాజులే వేరు. వాళ్ళకి ఒక అభిప్రాయం అంటూ ఉండదు. అయిదుగురు పెద్దలు ఏం చెబితే అదే వేదం, ఏంచేస్తే అదే పుణ్యకార్యం. తమకు హాయిగా ఉంటే పెద్దల్ని దేవుళ్ళనిచేసి కొలుస్తారు; కష్టం తగిలితే దెయ్యాలకింద చూసి తిడతారు. వింత మనస్తత్వం!

మంగళరాయుడితో పాటు అతని పన్నెండేళ్ళ కొడుకు కూడా బగ్గీమీద వస్తాడు. అతిగారాబంగా పెరుగుతున్నాడు. వాడికి తోచిందే చేస్తాడు. తోటి పిల్లలంటే పురుగులకింద జమ కడతాడు. ఇవే వాడికున్న సుగుణాలు: తండ్రీ కొడుకులు బగ్గి నిండా సంతసరుకు నింపుకొని ఇళ్ళకు చేరేవారు.

ఇలా ఉండగా, ఒకరోజున ఏం జరిగిందంటే - వినండి. ఆవేళ సంత. పైగా పండగ. పట్నం మొత్తం కిటకిట లాడిపోతోంది. ఎటుచూసినా ఒకటే సందడి! మంగళరాయుడి గుర్రపు బగ్గీ సంతకు చేరుకుంది. తండ్రీ కొడుకులు బగ్గీదిగి సంత బజారులో ముందుకు సాగారు.

వాళ్ళకు ఎదురుగా ఓ చిన్న కుక్కపిల్ల పరుగెత్తుతోంది. చాల అందంగా ముద్దుగా ఉంది; దాన్ని పట్టుకోవాలని వేణు గెంతుకుంటూ పోతున్నాడు. అతని ఒడికాలు బొత్తిగా అవిటిది. చంకకింద కర్ర లేందే అడుగేయలేడు. కుంటితనం తప్పిస్తే ఆ

కుర్రవాడంత మంచివాడు ఆ పట్నంలో మరెవరూ లేరు. పట్నంలో ఒక పేదకుటుంబం ఉందని ముందే చెప్పానుకదూ! అదే వేణు కుటుంబం! తల్లీ కొడుకు లిద్దరే ఉన్నారు. రాబడి పోబడి పెద్దగా లేదు. అతి సామాన్య సంసారం. వేణు అంటే తల్లికి పంచప్రాణాలు. అతన్ని విడిచి క్షణం బ్రతకలేదు.

కుంటివేణు ప్రతిసంతకు వచ్చి కూరగాయలు కొనుక్కుపోతూంటాడు. ఇవాళ అతనికీ కుక్కపిల్ల కనిపించింది. చూడ ముచ్చటైన దాన్నిపట్టి ఇంటికి తీసుకుపోవాలని అతని తాపత్రయం. పాపం, పరిగెత్తడానికి కాలు లేదాయె! అది అందడం లేదు.

కుక్కను పట్టాలని కుంటి వేణు గెంతడం చూస్తే మంగళరాయుడి కొడుక్కి పట్టరాని నవ్వు పైకి తన్నుకొచ్చింది.





'హా హా హా కుంటోడా ! నీ మొఖానికి కుక్కపిల్ల కూడానా? ఛస్తే దాన్ని పట్టుకోలేవు !' అని అంటూ, చప్పట్లు చరుస్తూ 'కుంటోడు.... కుక్కపిల్ల .... కుంటోడు....' అని అరిచాడు. ఈ అల్లరికి వేణు కలవర పడ్డాడు. చంకకిందికర్ర జారింది. నేలమీద బోర్లాపడ్డాడు.

'హా హా హా కుంటివెధవా! తిక్కొదిలిందా? నేను అన్లేదూ....కుంటి వెధవకి కుక్కపిల్ల కూడానా....?' అన్నాడు మంగళరాయుడి కొడుకు దగ్గరకంటా వచ్చి.

వేణు అతికష్టమ్మీద కూడదీసుకుని పైకి లేచాడు. బాధతో అతని ముఖం కందగడ్డయింది. వొళ్ళంతా దుమ్ము కొట్టుకుంది. మంగళరాయుడి కొడుకు మాత్రం ఇంకా వికారంగానే నవ్వుతున్నాడు.

'కోటీశ్వరుడి కొడుకువి. నవ్వుతావు. నన్నెగతాళి చెయ్యడానికి ఇందులో ఏముంది?' అన్నాడు వేణు.

ఇంతలో ఒక విచిత్రం జరిగిపోయింది.

పకపక నవ్వుతూన్న మంగళరాయుడి కొడుకుమీదికి ఓ పందికొక్కు దూకి పడింది. అది ఎక్కణ్ణించి ఎలా

వచ్చిందో తెలీదు. ఆ అదటుకి కెవ్వుమని అరిచి వెల్లకిలా పడిపోయాడు. లేవదీయడానికి మరెవరూ రాలేదు.

ఒక్క నిమిషంలో ఎవరూ ఎప్పుడూ ఊహించనంత విచిత్రం జరిగింది. సంతబజారు నిండా గునగునమంటూ బిలబిల మంటూ పందలు వేలు లక్షల ఎలుకలు. వాటిని చూసేసరికి ఎక్కడివాళ్ళక్కడ గిలగిల్లాడిపోయారు. సామాన్లు చిందర వంద రయ్యాయి. పళ్ళగంపలు బోర్లపడిపోయాయి. సారతట్టలు వెల్ల కిల పడ్డాయి. సరుకు పేర్చిన డేరాల తాళ్ళు పుటుకు పుటుకున తెగి నేలగరుస్తున్నాయి. సూదిమోపే సందులేదు. కనుమూసి కను తెరిచేలోగా కలకల్లాడే సంతబజారు కచాడి బిచాడి అయిపో యింది. ప్రాణాల్ని గుప్పిట్లో పెట్టుకుని మనుషులు ఇళ్ళల్లో దూరుతున్నారు. కొందరు గుండెచెదిరి పారిపోలేక చతికిలబడ్డారు. బెల్లంమీద ఈగలు ముసిరినట్టే వాళ్ళమీద ఎలుకలు కమ్మాయి. దూరుతున్నాయి. మరికొందరు ఎటూ పోలేక అందిన వారిని అందినట్టే అమాంతంగా వాటేసుకుని గలబిల చేస్తున్నారు. దిండులు తొక్కుతున్నారు. ఇంకొందరు బజారు వేపు గోడల కెగ బాకుతున్నారు. బళ్ళూ బగ్గీలు తెచ్చుకొన్నవారు తిరుగుప్రయాణం సాగించాలని చూశారు. కాని, ఏంలాభం? ఎలుకల దాడికి బెదిరి ఎడ్లూ, గుర్రాలూ తలోదోవకి పారిపోయాయి.

'ఓయి నాయనో! బాబో!' అని అరుస్తున్నారు మను షులు. జంతువులు సరేసరి తోక ముడిచి బెదిరి బెదిరి పోతు

న్నాయి. పైన కాకులు ఒకటేగోల! అంతా ఇంతలోనే బంగా
పట్నం మొత్తం గందరగోళమై పోయింది!

ఏమిదండు? ఏమిదండు?
ఎలుక దండు!

కారుమబ్బు కమ్మినటుల
గాలివాన వీచినటుల
ఏటివరద పారినటుల
ఎలుకదండు! ఎలుకదండు!

రాజు ఒరను కత్తిలాగ
రామచంద్రు బాణమల్లె
ఎటుచూస్తే అటువేపే
ఎలుకదండు! ఎలుకదండు!

గోడలలో వాడలలో
గొందులలో సందులలో
ఇంతసందు లేకుండా
ఎలుకదండు! ఎలుకదండు!

గుడి దేవుడి బొమ్మలపై
గోపురాల గోడలపై
ఇక్కడక్క డనకుండా
ఎలుకదండు! ఎలుకదండు!

చెట్లపైన పుట్లపైన
గట్లపైన మెట్లపైన
ఎడము లేక ప్రాకినదీ
ఎలుకదండు ! ఎలుకదండు !

పెంకుటిళ్లు పూరిళ్ళకూ
పాలరాతి మేడలకూ
ఎగబ్రాకెను చిత్రంగా
ఎలుకదండు ! ఎలుకదండు !

వంటింటా నట్టింటా
పడకటింట దడివెంటా
ఇంటింటా మంటల్లే
ఎలుకదండు ! ఎలుకదండు !

ఏమిదండు ! ఏమిదండు !
ఎలుకదండు !

చచ్చిచెడి చాయంగల విన్నపాలతో కొడుకుని తీసుకొని మంగళరాయుడు ఇంటికి చేరుకొన్నాడు. బజారులోని ఎలుకలు ఇంకా ఎక్కడ వెంటాడుతున్నాయోనని గుండెదడ. గభాలున లోపలికి దూరి దభీలుమని తలుపులు మూసేశాడు.

'నాన్నా ! నాన్నా ! ఆకలి వేస్తోంది!' అన్నాడు కొడుకు. ఈ గందరగోళంలోనే తీరని ఆకలి పుట్టుకొచ్చింది వాడికి.

'ఐతే, ఇప్పుడే పదండి ! అమీ తుమీ తేల్చుదాం !' అని ప్రజలు గుంపులు గట్టి పెద్దల్ని నడిపించుకుపోయారు.

'ఎలుకలు నశించాలి !' అని కొంద రరుస్తున్నారు.

'మంగళరాయుడు నశించాలి!' అన్నారు మరికొందరు.

'పట్నాన్ని పాడుచేస్తున్న ఎలుకలు నశించాలి !'

'ఆపద వచ్చినప్పుడు ఆదుకోలేని పెద్దలు నశించాలి !'

'ఎలుకలపీడ పోవాలి !'

'పెద్దల పీడ పోవాలి !'





ఇలా ఎవరికి తోచిన నినాదాలతో గందరగోళాలతో మంగళరాయుడి ఇంటిని చుట్టు ముట్టారు. నలుగురు పెద్దలు మాత్రమే మేడలోకి వెళ్లారు. తతిమ్మావారు వీధిలో నిలబడ్డారు.

'వళ్ళు దగ్గర బెట్టుకుని ఆలోచించండి !'

'పట్నంలో ఎలుకలే ఉంటాయో, మీరే ఉంటారో తేల్చండి !'

ప్రజల కేకలకు అంతులేదు. ఇక అయిదుగురు పెద్దలు మేడ చివరి గదిలో సమావేశమయ్యారు. తలుపులు, కిటికీలు బిగించారు. చర్చలు సాగించారు. అక్కడ ఎలుకలు లేవనుకోకండి ! ఉన్నాయి.. కాని వాటి బాధకంటే ప్రజలబాధ ప్రాణాంతకంగా ఉందిమరి !

'మనకేదో శని చుట్టుకుంది !' అన్నాడొక పెద్ద.

'మరాఠీ దండులాగ మన పాలిట ఈ ఎలుకలు ఎక్కణ్ణించి ఊడిపడ్డాయో ! తలుచుకుంటే గుండె ఝల్లుమంటోంది !' అన్నాడింకో పెద్ద.

'ఏదో ఒక మార్గం చూడకపోతే ఇవాళతో మనపని హరిభజన చెయ్యవలసిందే !' అన్నాడు మూడో పెద్ద.

'పాల ముంచినా నీట ముంచినా భారమంతా మంగళరాయుడిదే ! ఆయన ఏంచేసినా సరే !' అన్నాడు నాలుగో పెద్ద.

'ఇదేం ఖర్మోమరి ! ఇదంతా నా చావుకొచ్చింది !' అని గొణిగాడు కోటీశ్వరుడు మంగళరాయుడు.

ఇలా అయిదుగురు పెద్దలు ఒకరి కొకరు తలపట్లు పట్టు కొంటున్నారు. వీధిలో ప్రజలు కేకలు పెడుతూనే ఉన్నారు. గదిలో వీళ్ళ గుస గుసలు వినడానికి కిటికీలచెంత ఒకరిద్దరు పొంచి పొంచి ఉన్నారు.

ఇంతలో గది తలుపు చప్పుడయింది.

'ఎలుకలు ! ఎలుకలు !' అని కంగారు పడ్డాడొకాయన.

'అంత చప్పుడు ఎలుకలు కావు, పందికొక్కుల మంద. బాబోయ్ !' అన్నాడు మరొకాడు.

మళ్లా తలుపుమీద టప టపమని చప్పుడయింది. మంగళ రాయుడికి చెమటలు పోశాయి. మళ్లా ఏదో మిడిమేలం నెత్తి మీద పడిందని అడలిపోతున్నాడు.

'తలుపు తియ్యండి ! మీకోసమే వచ్చాను !' మనిషి గొంతు వినిపించింది.

'అమ్మయ్య ! బతికాం. ఎవరో మనిషే !' అంటూ మంగళరాయుడు తలుపు తీశాడు. ఓ పొడుగాటి మనిషి గదిలో ప్రవేశించాడు. దుస్తులు మారిపోయాయి. విచిత్రమైన దుస్తులు. రంగు రంగు గుడ్డముక్కలతో తయారైన అంగరఖా వేసు కొన్నాడు. ముఖం కిలకిల్లాడుతోంది. కుడిచేతిలో మురళి.

బంగారు పూజలు పొదిగిన మురళి. ఆ వ్యక్తిని ఇంతకుముందు ఎవరూ చూసి ఉండలేదు.

'ఎవరు నువ్ ? ఎందుకొచ్చావ్ ?' అడిగాడు మంగళ రాయుడు. అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు.

'గౌరవనీయులైన మీ కంపురికి సహాయం చెయ్యడానికి వచ్చాను. నా వద్ద మంత్ర మురళి ఉంది. నా మురళి వాయిస్తే బ్రతికిఉన్న ఏ ప్రాణి అయినాసరే నే నెక్కడికి వెళితే అక్కడికి వచ్చేస్తుంది !' అని చెప్పాడు కొత్తమనిషి. అతని మాటలు కంచు గీసినంత స్పష్టంగా ఉన్నాయి.

'ఓహో....ఇలానా....మళ్ళీచెప్పు....చెప్పు....'అన్నాడు వింత ఆదుర్దా చూపిస్తూ మంగళరాయుడు.

'నా మురళిమీద కొన్ని స్వరాల్ని గీతాల్ని తయారు చేశాను. ఈ మంత్ర మురళి మహత్తు చెబితే చాలదు. కళ్ళారా చూడాలి. ఒక్కో రకమైన స్వరమూ, గీతమూ వాయిస్తే ఒక్కోజాతి పక్షులు జంతువులు వెంటబడి వచ్చేస్తాయి. పాములు ఎలుకలు ఒకటేమిటి అన్నీ....' అన్నాడు మంత్ర మురళి గాయకుడు.

పెద్ద లతని మాటలు విని నోరు తెరిచారు.

'ఇంతకీ నీ ఊరు....పేరు—?' సంశయిస్తూ అడిగాడు మంగళరాయుడు.

'నాకో ఊరూ పేరూ లేదండి. వీధి గాయకుణ్ణి. అందరూ అలానే పిలుస్తారు!' బదులు చెప్పాడు వీధిగాయకుడు.

మంగళరాయుడు అంత సంతృప్తి చెందినట్టు తోచదు. 'సరి ఇదివరకెక్కడన్నా అలా వాయించావావుటి?' అనడిగాడు.

'ఆఁ..... నిరుడు దీపావళికి ఉత్తరాదిన వాయించి పాముల్ని తీసుకుపోయి అడవిలో వదిలేశాను. మొన్న సంక్రాంతికి దక్షిణాదిన పందికొక్కుల్ని ఏట్లో ముంచేశాను....' అన్నాడు వీధిగాయకుడు.

మంగళరాయుడు ఆలోచనలో పడ్డాడు. అందరికీ పెద్ద కాదూ! అంచేత పెద్ద ఆలోచనలో పడ్డాడు.

ఇటు గది వెలుపల పొంచి ఉన్నవాళ్లు ఈ సంభాషణల్ని విన్నారు. వీధిగాయకుని వింత సంగతి వీధిలోవాళ్ళకి ఉప్పందించారు.

'ఎవడో మాయ మురళి తెచ్చాట్ట! ఎలికల్ని ఒక్క పాటతో హరహరా చేస్తాట్ట!'

'ఏ పుట్టలో ఏ పాముందో! ఎవడిదగ్గ ఏ మహత్తు ఉందో!'

'ఏమో ఇదంతా ఓ మాయగారడీ యేమో! ఆ ఎలుకల్ని వీడే మంత్రించి పంపాడేమో! డబ్బు గుంజటానికి యిదో ఎత్తేమో!'

'ఛ, ఛ ! మంత్రాలకు చింతకాయలు రాలతాయా ?'

ఇలా తలో విధంగా అనుకున్నారు. మంగళరాయుడి ఆలోచనలు సాగుతూనే ఉన్నాయి.

'వీడి ఆకారం చూస్తే ఉత్త అరిపేదవాడులా ఉన్నాడు. అచ్చం అడుక్కుతినేవాడి వాలకంగా ఉంది. ఈనాటి మనిషి కాడు. ఒక నూరేళ్ళనాటి మోటు మనిషిలా ఉన్నాడు. తాతల నాటి దుస్తులు. కాని, మాటలు వింటామా కోటలు దాటుతున్నాయి. ఇహ వీణ్ణి ఎలా నమ్మడం ?' ఆలోచించి ఆలోచించి ఆఖరికి వీథిగాయకుడి వేపు తిరిగి 'ఒరేయ్ అబ్బీ ! నీ పురాణం అంతా మా కక్కర్లేదు. నీ మంత్రమురళి మహత్తు ఎలాంటిదో మచ్చుకి ఒకసారి మాకు చూపించు !' అని అన్నాడు మంగళరాయుడు.

వీథిగాయకుడు చిరునవ్వు నవ్వాడు.

'మచ్చు చూపించాలన్నా వెయ్యి వరహాలు పుచ్చుకొంటాను' అని అన్నాడు.

పెద్దల గుండెలు ఝల్లుమన్నాయి.

'ఏవిఁటన్నావ్, మురళిమీద ఓ ముష్టిపాట వినిపిస్తే వెయ్యి వరహాలు ఇచ్చుకోవాలా ? ఏవిఁ కోరికరా బైరాగీ వెధవా ?' అంటూ మంగళరాయుడు వీథిగాయకుడి మీదకు దూకాడు. తతిమ్మా పెద్దలూ అతనిమీద విరుచుకు పడ్డారు. గదిలోంచి బయటకు నెట్టారు. ఆ విసురుకి మెట్లమీంచి వీథి గాయకుడు దొర్లాడు. కింద జనం !!



'ఛో, వెళ్ళిపో! ఈ పట్నంలో మళ్ళా కనిపించావంటే మర్యాద దక్కదు....'

'నీ మాయ మరాఠీల వేషం మా దగ్గర సాగుతయ్యా? దొంగ వెధవా....'

'ఈ చ-యల కొచ్చావా సోదిలోకిరావు....'

ఇలా తిడుతూ పెద్దలు మెట్లమీద నుంచున్నారు. వీధి గాయకుణ్ణి పెడఖు ఎందుకు నెట్టారు? అసలు ఏం జరిగింది? ఇది ఆలోచించిన మనిషి లేదు. ఆ ప్రజల తరహాలే వేరుకదా!

'తన్నండి తన్నండి ఊఁ చూస్తారేఁ?' అన్నారు కొందరు.

'ఉత్త దొంగముచ్చు!'

'అడుక్కుతినే వెధవ !

ఇలా తిట్టుమీద తిట్టు తిడుతూ జనం వీధిగాయకుణ్ణి వెంటాడారు. అందితే పచ్చడిగా తొక్కేవారు. కాని, వీధిగాయకుడు అందకుండా పెద్ద బజారు మలుపు తిరిగి సందుల్లో జొరబడ్డాడు.

వెంట తరుముతూన్న జనంలోంచి ఒకరు 'అసలు ఏం జరిగింది?' అనడిగాడు.

'నాకుమాత్రం ఏంతెలుసు ! మన పెద్దలు వాణ్ణి తరిమారు. అంతే తెలుసు !' బదులు చెప్పాదింకో అతను !

'అదే....అదే....వాళ్ళెందుకు తరిమారోనని అడుగుతున్నా !' మళ్ళీ ప్రశ్నించాడు మొదటి అతను.

'ఏం చొప్పదంటు ప్రశ్న వేస్తున్నావయ్యా ? వాడేదో బుద్ధితక్కువపని చేసిఉంటాడు. అందుకనే మన పెద్దలు వాణ్ణి తరిమారు. వారు తరిమారు కనక మనం తరిమేశాం. అయినా అన్నిటికీ కారణాలు వెతుకుతూ బుర్ర పాడుచేసుకోవడం తెలివి తక్కువ దద్దమ్మల లక్షణం !' అని అంటూ వెళ్ళిపోయాడు రెండో అతను.

'ఎందుకీ మేళాం ? ఎవరిందో ఎలుకల్ని వారే ఖతం ఖతం చేసేస్తే సరిపోతుంది. ఇంత భాగ్యానికి ఇంత గొడవ యెందుకు ? పోదాం, పదండి !' అని అనుకుని ఎవరిదోవన వారు ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఈ అల్లరీ ఆగమూనించి వీథిగాయకుడు సందు గొందుల్లోనించి నదివేపుకు వెళ్ళిపోతున్నాడు. ఈ పట్నం ప్రజల వింత వైఖరి తెలుసుకుంటూంటే అతనికి నవ్వూ విచారమూ వస్తున్నాయి.

'నిన్నే....కాస్త ఆగవూ....' వెనకనించి ఎవరో తనను పిలిచేసరికి వీథిగాయకుడు వెనుతిరిగి చూశాడు. కుంటి వేణు. చంకకింది కర్రతో గెంతుకుంటూ వస్తున్నాడు. చేయెత్తి పిలుస్తున్నాడు. వీథిగాయకుడు నిలబడ్డాడు. వేణుని చూస్తున్నకొద్దీ మనసు వెన్నలాగు కరిగిపోయింది. 'ఇంత పట్నంలో ఈ చిన్నారి కుర్రాడు ఒక్కడే కదా నన్ను ఆప్యాయంగా పిలుస్తున్నాడు !' అని అనుకున్నాడు.



'నీ కోసమే వస్తున్నాను....' అన్నాడు వేణు రొప్పుతూ.

'నా కోసమా..? ఏమిటి తమ్ముడూ పని ?'

తమ్ముడూ అన్న సంబోధన విని వేణు హృదయం పులకించి పోయింది. వీథి గాయకుణ్ణి వాటేసుకున్నాడు. వేణు వీథిగాయకుడి నడుం దగ్గరకి వచ్చాడు.

'సీతో మాటాడాలని వొచ్చాను.'

'ఓ .... కావలసినంతసేపు మాటాడుకుందాం. ఐతే ఇక్కడ మాత్రం లాభంలేదు. నది వొడ్డుకుపోదాం పద !' అని వీథిగాయకుడు వేణుకు చేయి ఆసరా ఇచ్చి తీసుకు పోయాడు. ఉభయులూ నది వంతెన మీదకు చేరారు. కూర్చున్నారు.

'నీ మంత్ర మురళిని ఈ పట్నంలో వాళ్ళెవరూ నమ్మడంలేదు. కాని నేను నమ్ముతున్నాను. నువు పాట పాడి ఎలుకల పీడ వదిలించ గలవు !' అన్నాడు వేణు.

వీథిగాయకుడు మందహాసం చేసి ! 'నువ్వెలా నమ్ముతావ్ చిట్టి తమ్ముడూ ?' అనడిగాడు.

'నాకు చాల గట్టి నమ్మకముంది ! మా అమ్మకూడా నాలాగే నమ్ముతోంది. పాత దుస్తులూ పేదరికం ఉన్నంత మాత్రాన గొప్పవాడు కాదనడం తప్పని మా అమ్మ చెప్పింది. అదీకాక ఈ ఆపత్సమయంలో మమ్మల్ని కాపాడడానికే నువు వచ్చావనీ, కాని నీ వేషభాషలు చూసి నమ్మలేక ఇక్కడి ధని కులు నిన్ను చాల అవమానించారనీ, అమ్మ చెప్పింది. నీ గొప్ప తనం కోటీశ్వరులకి తెలియక పోవచ్చు. కాని మాకు తెలుసు!' అన్నాడు వేణు.

వీథిగాయకుని మనసు ఆర్ద్రమై పోయింది.

'నువు చాల మంచివాడివి తమ్ముడూ ! మీ అమ్మగారు కూడా ఉత్తమురాలు. కనకనే మంచి బిడ్డల్ని గ్రహించ కలి

గారు.' సంతృప్తిగా అన్నాడు వీథిగాయకుడు. ఆ ఉభయులూ లోకాన్నే మరిచి హాయిగా కబుర్లు చెప్పుకున్నారు.

'అన్నా ! నువు ఇంకా అన్నం తిన్నట్టు తోచదు. మా ఇంటికి వెళదాం. మా అమ్మ చాల సంతోషిస్తుంది. ఏమంటావ్ చెప్పు ?'

వీథిగాయకుడు నవ్వుతూ 'తప్పకుండా వస్తాను. మీ ఇంటో మీతో కలసి భోంచెయ్యడం నాకు చాల ఇష్టం కూడా' అని అన్నాడు.

వారిద్దరూ పట్నం వేపు బయల్దేరారు. దోవలో వీథి గాయకుడు కుంటి వేణుకు ఎన్నో కబుర్లు చెప్పాడు. అన్నీ అతని స్వంత విషయాలే ! బంగారు కొండలో నేనట కాపరం ! తోడు ఎవరూ లేరట ! ఎన్నో విచిత్రాలు తెలుసుట ! మంచి వాళ్ళం దరికీ మేలు చెయ్యడం, దుష్టబుద్ధులకు మంచి నేర్పడం. ఇవే అతనికి ఇష్టమైన పనులట !....ఇవన్నీ వింటూంటే వేణుకి తానొక మహాద్భుత వ్యక్తితో కలిసి సరసనే నడుస్తున్నందుకు ఎంతో గర్వం కొంగింది.

ఆ ఉభయుల్ని చూసి వేణు తల్లి సంతోషించి మనసారా గౌరవించి ఆదరించింది. ఇంటో ఉన్న కొద్ది సామాగ్రితోనే చక్కగ వండి వడ్డించింది. భోజనాల సమయంలో వేణు ముద్దు ముచ్చటల్నే పదేపదే వర్ణించి చెప్పింది తల్లి. ఆఖరికి ఎలుకల గొడవ ఎత్తింది. 'ఈ పట్నం ధనికులకు డబ్బుంది. కాని తెలివి

తేటలులేవు. కోరి సహాయం చేస్తానంటే, కాదని నిన్ను అవమానించారు. నాకు చాల విచారంగా ఉంది!' అని అంది తల్లి.

వీథిగాయకుడు నవ్వుతూ 'మీరేమీ విచారించనక్కర్లేదమ్మా! మన పెద్దలు ఒక సామెత చెబుతుంటారు. వినలేదా? 'చేసుకొన్న వాడికి చేసుకొన్నంత మహాదేవా!' అని. కొద్ది రోజులు తాళి చూడండి. ఏం జరుగుతుందో మీ కళ్ళతో మీరే చూస్తారుగా!' అన్నాడు.

'ఏమో తండ్రీ! ఈ ఎలుకల బాధ తీరే ఉపాయం మరి వేరే లేదా?' అనడిగింది తల్లి.

'ఆ బాధ తీరుతుంది. వాళ్ళే వస్తారు. మీ కెందుకు మీరు ఊరికే చూస్తూ ఉండండి!....'

ఆ తర్వాత వీథిగాయకుడు తల్లీ బిడ్డలవద్ద సెలవు తీసుకొన్నాడు. ఉండమని వారు బలవంతం చేశారు. కాని మర్నాడు మళ్ళా కనిపిస్తానని చెప్పి బయల్దేరాడు.

అతను కంటికగుపించినంత మేర చూస్తూ వాకిట్లో నిలబడ్డారు తల్లీ కొడుకులు.

ఆమర్నాటి సాయంత్రం ఓ సంఘటన జరిగిపోయింది. దాంతో మంగళరాయుడు వీథిగాయకుడి కోసం వెర్రెత్తిపోయాడు. ఏం జరిగిందో చెబుతాను-

మంగళరాయుడి కొడుకు నైజం మీకు ఇదివరకే తెలును. అతని కీ రెండురోజుల్లోను ఆలోచించగా ఆలోచించగా ఒక వింత

ఆలోచనతట్టింది. అదేమంటే- వాళ్ళ మేడముందు చాల ఎత్తయిన స్తంభం ఒకటి వుంది. ఉత్సవాలకీ,పండగలకీ ఆ స్తంభానికి గంటలు కట్టి, దీపాలు వేలాడతీసే వాళ్ళు. మంగళరాయుడు కొడుకు చక్కాపోయి స్తంభాన్ని చరచరా ఎగబాకాడు.

ఒక్కగాను ఒక్కకొడుకు. రెప్పపాటన్నా వదిలి ఉండలేరు తల్లి దండ్రులు. అంతలోనే వెతుక్కుంటూ వాకిట్లోకి వచ్చారు. తీరా చూసేసరికి అప్పటికప్పుడే చేయెత్తినా అందనంత ఎత్తులో వున్నాడు. మరీ తల్లిగుండె గుబగుబలాడి పోయింది. 'దిగుదిగుమ'ని కేకలు పెట్టారు.

'ఒరే తండ్రీ! నీ పున్నెం. దిగుదిగు' అంది తల్లి.

'నాకేం భయంలేదే!' మరో అడుగు పైకి పాకాడుకొడుకు.

తండ్రికేం తోచలేదు. వాడెందుకు స్తంభం ఎక్కుతున్నదీ



అర్థం కాలేదు, 'ఎందుకురా స్తంభం ఎక్కుతున్నావ్, అనడి గాడు పైకి చూస్తో.

కొడుకు తండ్రి మొహంవేపు చూసి, తాను వనర ఇంత గొప్పపని చేయడం జరుగుతోందన్న ధీమాతో-'ఎలుకల పీడ వదిలించుకోవాలంటే ఇంతకన్నా మంచి మార్గం వేరే ఉండదు నాన్నా! పందెం వేసి చెబుతున్నాను. ఇక అరిచి గీ పెట్టినా ఏ ఎలుకా నా జోలికి రాదు. అసలు ఇంతకన్నా ఈ ఊళ్ళో మంచి చోటులేదు నాన్నా!' అని జవాబిచ్చాడు.

తలిదండ్రులకు ముందుచూస్తే నుయ్యి వెనుకచూస్తే గొయ్యి లాగా ఉంది. పుత్రుడి సుగుణాలు తెలుసు. తెగ బతిలారు.

'దిగు బాబూ దిగు! మాయదారి ఎలుకల గొడవ ఎలాగో వదిలిద్దాం. నువ్వు మాత్రం భద్రంగా దిగుబాబూ!' అని అరుస్తున్నారు. కాని ఏం లాభం?

వాడు దిగలేదు. పైగా వాళ్ళు బతిమాలుతున్నకొద్దీ మరింత హుషారుపుట్టి ఆకతాయితనంగా పైపైకి పాకుతున్నాడు.

ఇది ఇలా ఉండగా, స్తంభానికి అవతలివేపున ఓ పెద్ద మేడ ఉంది. పై అంతస్తులో యజమాని ఎలుకల్ని వేటాడుతున్నాడు. పచ్చడిబండ పుచ్చుకొని ఆ మూలకు ఈ మూలకు పరుగులు తీస్తున్నాడు. ఆఖరికో ఎలుకను పట్టుకొన్నాడు. అక్కడికది మహాకార్యమై పోయింది. కసిదీరా దాన్నిబాది, చివరికి తోకబట్టి కిటికీలోంచి విసిరేశాడు.

సరిగ్గా, ఆ ఎలుక ఎక్కడ పడిందో మీరు ఊహించ గలరా ? స్తంభంమీద పైపైకి ఎగబాకుతున్న మంగళరాయుడి కొడుకు భుజమ్మీద పడింది. దాంతో వాడు ఎంత కలవరపడిందీ మీరే ఊహించగలరు. అప్పటికే అలిసిపోయి వున్నాడు. ఇక ఎలుక మీద పడేసరికి బేజారెత్తి రక్కు మనకయిరమ్మి చేతిపట్టు వదిలేశాడు. ఎండు కొబ్బరిమట్ట రాలిపడ్డట్టు నేలమీదకు రాలాడు.

ఈ దుస్సంఘటనతో మంగళరాయుడికి పూర్తి మతి పోయింది. తల్లి స్పృహతప్పి పడిపోయింది. ఆ నిమిషంలో యావదాస్తీ ఖర్చుచేసి కొడుకుని రక్షించాలని నిర్ణయించు కొన్నాడు మంగళరాయుడు. అయితే, అంత ఎత్తునుంచి పడినా కుర్రవాడు నిరపాయంగానే ఉన్నాడు.

ఇదే సమయంలో వేణుతల్లి, మరికొందరు ఇరుగు పొరుగువారు అదేవీధిగుండా పోతున్నారు. వాళ్ళా ఈ సంఘట నను చూశారు. మంగళరాయుడిని ఉద్దేశించి వేణుతల్లి ఇలా అంది. 'అదృష్టవశాత్తు నీ కొడుకు నిలువక్కాడు. ఇప్పటికైనా ఆ వీధిగాయకుణ్ణి పిలిపించి ఎలుకలపీడ వదిలించు. నీకూ క్షేమం; పట్నానికీ క్షేమం !-'

మంగళరాయుడు చప్పున 'వీధిగాయకుణ్ణి పిలవండి ! ఎంత అడిగితే అంత ఇవ్వడానికి సిద్ధం ! పిలవండి వీధిగాయ కుణ్ణి !' అన్నాడు.



ఎవరిని నిన్న అతినీచంగా అవమానించి పంపించారో ఆ వీథి గాయకుడికోసమే అందరూ ఆరాటపడుతున్నారు. నిన్న 'దొంగవెధవ' నేడు తమపాలిటి 'దేవుడు!'

కుంటివేణు నదివేపు పరిగెత్తుతున్నాడు. అతనికెంతో ఆనందంగా ఉంది. తిరిగి వీథిగాయకుణ్ణి పట్నానికి పిలిచే అవకాశం వచ్చింది. వంతెనమీద కూచున్నది వీథిగాయకుడేనా? ఔను. అతనే. వేణు సంతోషంతో చప్పట్లు చరిచాడు.

'చప్పున బయల్దేరు! పట్నం పెద్దలు నిన్ను పిలుస్తున్నారు. నువు బయల్దేరడమే ఆలస్యం! నీకోసం ఎదురుచూస్తున్నారు. అందరికన్నా ముందు మంగళరాయుడే నీకోసం కలవరిస్తున్నాడు!' అన్నాడు వేణు.

'నాకు తెలుసు. నా కోసం తప్పక వెతుకుతారనీ ముందే తెలుసు' అన్నాడు వీథిగాయకుడు. ఉభయులూ పట్నంలో కొచ్చారు. మంగళరాయుడికి వీథిగాయకుడు కనపడగానే నోటమాట పెగల్లేదు. ఆ తర్వాత కోలుకుని పట్టరాని ఆపుర్దాతో ఎదురువెళ్ళి వీథిగాయకుడి రెండు చేతులూ పట్టుకొన్నాడు 'ఇదుగో .... ఇవి చేతులుకావు.నీమంత్రమురళిని ఉపయోగించు. వెయ్యి కాదు పదివేలు, ఇరవై వేలు యాభై వేల వరహాలు ఇస్తాను. ఈ ఎలుకలపీడ వదిలించు. సంశయించకు: మా ప్రాణాలు నీ చేతుల్లో ఉంచుతున్నాం!' అన్నాడు మంగళరాయుడు.



మంగళరాయుడి దీనవచనం చూస్తే ఎవరికైనా జాలిపుట్టిస్తుంది. 'సరే! అలాగే' అన్నాడు వీథిగాయకుడు. అంతకుమించి మరోమాట అనలేదు.

వీథిగాయకుడు నాలుగుబజార్లు కలిసేచోటికి పోయాడు. ఎత్తయిన వేదికమీద నించున్నాడు. బంగారుపూజలు పొదిగిన



చిత్రమురళిని బయటికి తీశాడు. ఏం జరగబో తోందా అని అందరూ నివ్వెరపోయి చూస్తు న్నారు.

వీణగాయకుడు ముర ళిని పెదవుల కానించాడు. ఏదో అనిర్వచనీయమైన రాగాన్ని ఆలాపించాడు. నలువేపులకీ తలతిప్పి మోగిస్తున్నాడు.

ఆ మురళీరాగం గాలి తరంగాల్లో కలిసింది. గాలి ఎంత మేర చొచ్చుకుపో తోందో అంత మేర మురళీ రాగం వెళుతోంది. గాలి లేనిచోట ఎలుకలు మాత్రం ఎందుకుంటవి? ఆ రాగం చెవిని బడిన ప్రతి ఎలుక చేష్టలుడిగి చెవులు రిక్కిం చాయి. రాగం మత్తుమందు లా సోకుతోంది.

తినే పదార్థాలన్నిటికన్నా ఈ రాగం బహు రుచిగా ఉంది. కంటికి కనిపించిన ప్రతివాన్నీ పాడుచేయాలని తలపెట్టిన ఎలుకలు ఇప్పుడు మరే యోచనా చెయ్యడంలేదు. వాటి కంటికి, చెవులకు కనిపించేదీ వినిపించేదీ ,ఒక్కే, ఒక్కటి, వీథిగాయకుని మంత్ర మురళీరాగం !

వీథిగాయకుడు చటుక్కున రాగం మాని పాట ప్రారంభించాడు. ఆ పాట ఎలుకల భాషలో ఉంది.

ఎలుకల్లారా
ఎలుకల్లారా
ఇక్కడ అక్కడ ఎక్కడ ఉన్నా
ఆనందంగా రారండమ్మా !

గాదెలకిందీ పందికొక్కులూ
వోదెలలోనీ పందికొక్కులూ
బోదెలలోనీ పందికొక్కులూ
కదలండమ్మా కదలండీ !

ఇళ్ళల్లోనూ గుళ్ళల్లోనూ
కుళ్ళగించే ఓ ఎలుకల్లారా
మేడ గదులలో కాపురమున్నా
కోడుకట్టినా ఎలుకల్లారా !

విరామ మెరుగక కిచుకిచు మంటూ
చూరుల తిరిగే చుంచుల్లారా

అపాయ మెరుగక చరచర తిరిగే
ఉపాయమున్నా పూసల్లారా
అక్కడ ఇక్కడ ఎక్కడ ఉన్నా
ఆనందంగా రా రండమ్మా !

ఇక ఎలుకల సంగతి ఎలా ఉంటుందంటే—

గబగబమని గెంతినవీ
దబదబమని పరిగెత్తినవీ
కిస్ కిస్‌మని ఇకిలించినవీ

కిటికీల్లోంచి దూకుతున్నవీ
గోడలమీంచి జారుతున్నవీ
తటుకు తటుకునా ఉరుకుతున్నవీ

పదులు పదులుగా బయలుదేరి
వంద వందలుగ గుంపులు కట్టి
వేలు వేలుగా మందలుగట్టి
ఎలుకల దండూ వెడలినదీ.

వీథిగాయకుడు మరోపాట ఎత్తుకొన్నాడు; ముందుకు సాగారాడు. ఎలుకలు వెన్నాడుతున్నాయి. వీథిగాయకుడు ప్రతి వీథిమొగ నిలిచాడు. అతని సరికొత్తపాట ఇంటింటా విస్తరించింది. వీథిగాయకుడు నదివేపు తిరిగాడు. ఎలుకల గుంపు నాట్యం చేస్తోంది. అతని పాట లయమారుతోంది, ఎలుకల నడక మారుతోంది.

ముందు వీథిగాయకుడు. ఆ వెనక ఎలుకల దండు. నది వొడ్డుకు చేరారు. వీథిగాయకుడు మిట్టమీద నుంచున్నాడు. మురళి నదివేపుకు వొంచాడు. పాట నదీ తరంగాలమీద కదను తొక్కుతోంది. పాట లయ అతి వేగంగా మారుతోంది. ఎలుకలు ముందూ వెనకా చూడడంలేదు. చెవులు ఒక్కటే పని చేస్తున్నాయి. పాట తేలిపోతూన్న నది వేపుకి గెంతాయి. ఒకదాని వెంట మరొకటి. ఒక గుంపు వెనక మరోగుంపు నదిలోకి దూకాయి. దూకినవి దూకినట్టే నీళ్ళ అడుగునకు చేరుతున్నాయి. ఆ పైన అవి ఏమయ్యాయో ఎవరికీ తెలీదు. కొద్ది నిమిషాల్లో వేలూ లక్షల సంఖ్యలో ఉన్న ఎలుకలు అదృశ్యమయ్యాయి.

ఇక, పట్నంలో సంగతి ఎలా ఉంది ?

పట్న ప్రజల తెలివితేటల్ని గురించి మాటి మాటికి చెప్పి మీకు విసుగెత్తించడం నాకు ఇష్టంలేదు. పెద్ద వానగాలి వీచి ఆగిపోయినట్టుగా ఎలుకమంద మాయమయ్యేసరికి తెరపి ఇచ్చింది. ఇలాంటి మహాద్భుతమైన పని జరగడం కేవలం మంగళరాయుడి గొప్పదనమని ప్రజలు భావించారు. ఇంటింటి నించీ జనం వీథుల్లోకి వచ్చారు. కాగడాల్ని వెలిగించారు! 'మంగళరాయుడికి జై' అన్నారు. నిమిషంలో పట్నం అంతా కదిలింది. మంగళరాయుడిని చేతులమీద కెత్తుకున్నారు. ఊరేగింపు సాగించారు. హారతులు ఇస్తున్నారు. పాడుతున్నారు.

మంగళరాయునికీ జయ్
మన
మహామహానికీ జయజై !

ఎలుకలపీడా వదిలించీ
ఇలవేల్పుగ మము పాలించీ
బంగరు పట్నం క్షేమంకరుడౌ
మంగళరాయునికీ జై ! జై !!

అందరి కష్టాల్ తన కష్టముగా
ఆపదవస్తే అడ్డుగ నిలిచీ
మన కష్టాలీడేర్చిన ఘనుడౌ
మంగళరాయునికీ జై ! జై !....

ఊరేగింపు సంతబజారులో ఆగింది. వేదికమీది . కెక్కి మంగళరాయుడు తనకుతానే చప్పట్లు చరుస్తూ ఉపన్యసించాడు.

'నా తోటి ప్రజల బాధలు చూసి నా గుండె కరిగిపోయింది. ఆపద వచ్చినప్పుడు అభయమిచ్చి కాపాడడం నా విధి. నా విధిని నేను సంతృప్తిగానే పూర్తిచేశాను. పరమ శత్రువులైన ఎలుకల్ని పరిమార్చాను. అవి కట్టుకున్న స్థావరాల్ని కూల్చేశాను. ఇలాంటి కష్టతరమైన ప్రజాసేవ కోసమే నా జీవితాన్ని అంకితం చేశాను. పెద్దరికం గ్రహించాను. ఇప్పుడిక హాయిగా ఉండమని హామీ ఇస్తున్నాను.'

ఇంతటితో ఆగలేదు. ఆ పైన విందులూ వినోదాలూ తెగ జరిగిపోతున్నాయి.

'ఎలుకల్ని చంపిందెవరో నీకు తెలుసా ?' అని అడిగాడు మంగళరాయుడి కొడుకు వేణుని. వేణుకి అసలు సంగతి తెలుసుకాని ఈ గడబిడలన్నీ చూస్తుంటే అతనికి మతి పోతోంది.

'ఎవరు చంపారేమిటి ?' అనడిగాడు వేణు.



'చచ్చు దద్దమ్మా! మా నాన్నగారు ఎలుకల నన్నిటినీ చంపి పాతిపెట్టేశారు. తెలుసా ?'

'మీ నాన్న..చంపాడా' బిత్తరపోయాడు వేణు.

'నీ మొఖానికి ఏం తెలుస్తుంది మరి! ప్రజలందరూ పండగ చేసుకుంటూంటే కూడా నీకు తెలియదయ్యె!' అని ఉల్లాసంగా వెళ్ళిపోయాడు మంగళరాయుడి కొడుకు.

పాపం, కుంటి వేణు గుండెల్లో ఆవేదన ఎవరికి తెలుస్తుంది ?

ఊరేగింపులూ ఉపన్యాసాలు అయిపోయాక అంతులేని మహదానందంతో మంగళరాయుడు ఇంటికి చేరుకొన్నాడు.

వాకిట్లో వీథిగాయకుడు నుంచున్నాడు !

'ఎవరు నువ్ ?' అనడిగాడు మంగళరాయుడు.

'నన్నే మరిచిపోయారా మంగళరాయుడుగారూ : ముందు నాకు చెల్లించవలసిన వెయ్యి వరహాలు ఇచ్చెయ్యండి !' అన్నాడు వీథిగాయకుడు.

'వెయ్యి వరహాలా ?....ఆ మాటే నాకు గుర్తులేదే ? అసలు అసలు గుర్తులేదు. ఏమిటి ? ఎంత ? వెయ్యి వరహాలా ?....' ఇలా అలా తోకాలేని జవాబులిచ్చాడు మంగళరాయుడు.

'మంగళరాయుడుగారూ ! మరిచిపోయినట్టు నటించకండి. మీ అంతటికి మీరే యాభై వేల వరహాలు ఇస్తామన్నారు. కాని, నేను కోరింది వెయ్యి వరహాలే ! నా శ్రమకు అది చాలు ! ఆ వెయ్యి వరహాలు పుచ్చుకోడానికే వచ్చాను !' ఖరాఖండిగ అన్నాడు వీథిగాయకుడు.

'అలాగా....కాసేపు నిలబడు ! ఇప్పుడే వస్తాను !' అంటూ లోపలికి వెళ్ళిపోయాడు. సలుగురు పెద్దలకోసం మనుషుల్ని తరిమి పిలిపించాడు. వాళ్లు చేరారు. అందరి ముఖాల్లో ఎలుకలపీడ వదిలిందన్న సంతోషం వెల్లివిరుస్తోంది. ఆ అయిదుగురు పెద్దలూ కలిసి చర్చించి తేల్చిన విషయం ఇది. 'వీథిగాయకుడి శ్రమకు తృణమో పణమో ఇవ్వడం మంచిదే కాని వెయ్యి వరహాలు ఇవ్వడం అనవసరం. ఆ ధనంతో మంచి విందు చేసుకుందాం. అలాగా అయితే ఊళ్ళోవాళ్ళందరికీ సంతర్పణ చేద్దాం. కాబట్టి మంగళరాయుడుగారే మరో కంటివాడికి

తెలీకుండా వీథిగాయకుణ్ణి సాగనంపాలి.' ఇదీ వాళ్ళు చేసిన నిర్ణయం.

మంగళరాయుడు బయటికి వచ్చాడు.

'డబ్బు ఇప్పండి!' అనడిగాడు వీథిగాయకుడు.

'సరే! ఇందు తీసుకో:' అంటూ మంగళరాయుడు ఓ యాభై వరహాలు ఇవ్వబోయాడు. కాని, వీథిగాయకుడు వాటిని ముట్టలేదు.

'ఎంత?'

'యాభై! దీంతో నీకూ మాకూ రాం రాం!' అన్నాడు మంగళరాయుడు.

'వెయ్యి వరహాలకు ఒక్క దమ్మిడీ తక్కువైనా నేను ముట్టుకోను. మొత్తం చెల్లించండి.'

'ఇచ్చింది పుచ్చుకోవా?'

'అనుకున్నదానికి అంపైసా తక్కువైనా పుచ్చుకోను!'

'అనుకున్నదంతా ఇవ్వాలా?'

'ఆఁ. అక్షరాలా చెల్లించి తీరాలి.'

'అలా కాకపోతే....?' అనడిగాడు మంగళరాయుడు.

'అలా కాకపోతేనా....అటుపైకి మీరే విచారిస్తారు!'

'ఏఁవిటోయ్ విచారించేది ఇప్పుడప్పుడు! ఇదుగో! ఎలుకలు వచ్చాయి. నా కళ్ళారా చూశాను. వచ్చిన వాటిని తిరిగి

బ్రతికించి నువ్వు తీసుకురాలేవు. ఎందుకు వచ్చిన ప్రయాసం ! కాబట్టి మేం మర్యాదగా ఇచ్చింది పుచ్చుకో ! నీకు క్షేమం !'

'ఉభయుల క్షేమం ఆలోచించండి ! ఆడితప్పకండి ! అనుకొన్న వెయ్యివరహాలు ఇవ్వండి ! నేను వెళ్ళిపోవాలి !'

'వెళ్ళిపోవాలనుకుంటే వెళ్ళిపో! అంతేకాని బెదిరించకు!'

'ఆడితప్పటం మంచిదికాదని ఆఖరిసారి చెబుతున్నాను. జాగ్రత్తగా ఆలోచించండి ! తెల్లవారేసరికల్లా నాకీయవలసిన వెయ్యివరహాలు చెల్లిస్తే సరేసరి ! లేదా మీరు కష్టనష్టాలకు గురి అవుతారు. తర్వాత ఏడ్చి లాభంలేదు!' అని వెనక్కి తిరిగాడు వీధిగాయకుడు.

'ఓరి అడుక్కుతినే దరిద్రపుగొట్టు వెధవా ! బెదిరిస్తున్నావా ? పో ! నీకు దిక్కున్నచోట చెప్పుకో ! నిన్ను పుట్టించిన వాడు వచ్చినా ఒక్కపైసా ఇచ్చేది లేదు !' అరిచాడు మంగళరాయుడు.

వీధిగాయకుడు బజార్లుదాటి వచ్చేశాడు. అతనికోసం వేణు-వేణుతల్లీ ఎదురు కాచుక్కూచున్నారు. ఆదుర్దాపడుతున్నారు.

'ఏం జరిగింది ?' అనడిగారు, తల్లీకొడుకులు.

'అనుకుందే జరిగింది !' అని అంటూ అక్కడ జరిగిన విషయమంతా చెప్పాడు.

'అయ్యో ! ఎంత అన్యాయం !' అంది వేణుతల్లి.

'వాళ్ళకది సొమ్ము ఇప్పుడు !' అన్నాడు వేణు.

'చెల్లించి తీరతారు. మీరే చూస్తారు !' అన్నాడు వీధి గాయకుడు. వేణుతల్లి చాల బాధపడింది. ఇంత అన్యాయం జరగడం మంచిది కాదనుకుంది. ఇరుగుపొరుగువారిని పిలిచింది. విషయం చెప్పింది. ఆఖరికి- 'వీధిగాయకుడు మనల్ని రక్షించాడు. మనం ఆడిచ్చిన అన్యాయానికి ఒడిగడుతున్నాం. మంగళరాయుడు ఇంత అధర్మానికి దిగుతూంటే మీరంతా చూస్తూ ఊరుకోవలసిందేనా ?' అని అడిగింది. కాని ఆ ప్రజల సంగతే వేరు !

'ఏం చెయ్యగలం ! మంగళరాయుడు మనపెద్ద. ఆయన ఇలా ఎందుకు చేశాడో పైన భగవంతుడికే తెలియాలి. ఆయన చేసినదాన్ని కాదనడానికి మనం ఎవరం ?' అన్నారు ఇరుగు పొరుగువాళ్లు.

వేణుతల్లికి ఏం తోచలేదు. ఇంటికి పరిగెత్తింది. గూట్లో పెట్లో వెతికింది. కాని పేదకొంపలో పెన్నిధి ఉంటుందా ? వెతగ్గా వెతగ్గా చివరకు ఒక్క వరహా దొరికింది. బంగారు పట్నం పెద్దలు వీధిగాయకుడికి చేసిన మోసం ఈ వరహాతో తీరుతుందా ? కాని, ఆ పేదతల్లికి అంతకన్నా తోచలేదు. మళ్లా వీధిగాయకుడి వద్దకు వచ్చింది. ఇంత జరిగినా వేణుతో వీధి గాయకుడు కులాసా కబుర్లు చెబుతూనే ఉన్నాడు.

'బాబూ ! నా ఇల్లంతా గాలించాను. ఈ ఒక్క పరహా కన్నా ఎక్కువ తేలేకపోయాను. ఇదే తీసుకో ! నీకు జరిగిన అన్యాయం తలుచుకుంటే నా గుండె తరుక్కుపోతోంది !' అంది వేణుతల్లి.

పరహా తీసుకోలేదు. పైగా వినయవిధేయలతో వీధి గాయకుడు 'అమ్మా ! ఆ పరహా నీ వద్దనే ఉంచు. చిట్టివేణుకి కొత్తబట్టలు కొని ఇవ్వు. నా బాకీ ఎక్కడికీ పోదు. పెద్దలే చెల్లిస్తారు ! దాన్నిగురించి దిగులు పడకమ్మా !' అని అన్నాడు.

'ఆ బాకీ ఎలా వసూలవుతుంది?' అనడిగింది వేణుతల్లి.

మంత్ర మురళిని చూపించి 'ఇదుగో ! దీన్తోనే నాబాకీ వసూలవుతుంది. నీకూ నీబిడ్డకు ఎలాంటి ఇబ్బందీరాదు. నా మాట నమ్మి హాయిగా ఉండండి. మీకు మేలు జరుగుతుంది !' అని వీధిగాయకుడు నదివేపు చరచరా వెళ్ళిపోయాడు.

అర్థంకాని అయోమయ ఆవేదనతో అలానే నిలబడి పోయారు తల్లీ కొడుకులు....

తెలతెలవారే వేళ.

నల్లని చీకటి విడిపోతున్నది. తూర్పున తెలిరేకలు విరుస్తున్నాయి. పట్నప్రజలు ఇంకా మేలుకోలేదు. తోటల్లో కోయిలలు పాడుతూనే ఉన్నాయి. తెల్లనివెలుగు పట్నంమీద ప్రసరిస్తోంది ! ముంగిళ్ళలోని పువ్వులు అప్పుడే విచ్చుకుంటున్నాయి. పూలమీదా ఆకులమీదా మంచుబిందువులు ముత్యాల్లా మెరుస్తు



న్నాయి. పక్కల మీది పాపలు తెలవారగట్ల వచ్చే తీయటికలల్లో మునిగి తేలు తున్నారు. పూరేకులలాగా వారి చిన్ని పెదవులు విచ్చు కుంటున్నాయి. చిరునవ్వులు చిందిస్తున్నారు. ఏ తీయటి కలల్ని కంటున్నారో!

ప్రభాత మందానిలాలు వీస్తున్నాయి. పూలవాసన కలసి ఆచల్లనిగాలి మైమర పిస్తోంది! వీటన్నిటికీ మించిన అతి మనోహరరాగం విని పిస్తోంది! ఎక్కడనించి?

సంతబజారు వేదికమీంచి మురళీరాగం. వీధిగాయకుని పెదవులమీద మంత్రమురళి ఊగిపోతోంది. చిరుగాలికి చెదిరే గరికపోచలాగ వీధిగాయకుని పెదవులపై మురళి. ఆ తీయని రాగం గాలిలో తేలుతోంది. బంగారు పట్నాన్ని మొత్తం రాగం చుట్టుముట్టింది.

తెరచిన కిటికీల్లోంచి రాగం ఒక పిలుపులాగా బిడ్డలందరి చెవుల్లోను దూరించి. తట్టి లేపినట్టు వినిపిస్తోంది! మెత్తని

రాగం బిడ్డలందరినీ మేలుకొల్పుతోంది. మొద్దునిదుర పోయే పెద్దయ్యలకు కూ రాగంలోని తీయందనం తెలీదు. పువ్వులకంటే మెత్తనైన పాపలకే ఆ రాగం వినిపిస్తోంది.

ఎక్కడివి పాపలు అక్కడే లేచారు. కళ్ళు విప్పారు. వాళ్ళకు కనిపిస్తున్నదేమిటి? ఇళ్ళూ మంచాలు కాదు. ఏదో అందమైన దృశ్యాలు. గాలికంటే వేగంగా కళ్ళముందు జరిగి పోతున్నాయి.

రెప్పపాటు కాలంకూడా ఆ సుందరదృశ్యాల్ని వదిలిపెట్టి ఉండలేమనిపించింది వాళ్ళకు. ఓహో చిత్రం! ఇప్పుడు రాగం బదులు పాట! ఎవరో రమ్మనమని కోటి చేతులెత్తి పిలుస్తున్నారు. ఇంటింటా ఏ బిడ్డ కాబిడ్డకు ఆ పిలుపులన్నీ తనకేనని ఊహిస్తున్నారు. ఏం పాట! ఏం పాట!!

పాపల్లారా! నా కూనల్లారా
పండువెన్నెలలు చిలికే బాబుల్లారా!
మురళీరాగం వినిపిస్తోందా?
ముద్దూ ముచ్చట వినిపిస్తోందా!

తీయనికలలో మునిగిన పాపా
తేలుకొని ఇటు రావే పాపా
పెదవుల నవ్వులు చిందే పాపా
కదిలి నీవిటు కూడవె పాపా



తూగుటుయ్యేలల పవళించారా
రాగమధువులను చిలికించారా
మత్తునిద్దురలు విడివస్తారా
క్రొత్తలోకమును గనవస్తారా

వింతలోక మొకటున్నది తెలుసా
వినియుందరు మీ కింతకుముందూ
అంతులేని ఆనందం కలదూ
అందరికది అందుబాటు కాదూ

పూవులు నవ్వుతు స్వాగతమిస్తవి
ఆవులు కోడెలు పల్కరిస్తవీ

లేకున్నా కుందేళ్ళూ నెమళ్ళూ మరి
ఇళ్ళల్లోవలె మాటాడి స్తవి.

మంగళరాయుడి కొడుకు నరేసరి! కప్పుకున్న దుప్పటిని దూరంగా తన్నేసి చివాలున నించున్నాడు. పాట వింటూనే వళ్లు మరిచిపోయాడు. వీథిగాయకుని పాట ముందే అందుకున్నాడు. మేడమెట్లు దిగి చరచరా వీథిలోకి 'గెంతాడు. అతన్ని ఎవరో చేయిపుచ్చుకుని లాగినట్టుగా పరుగెత్తుతున్నాడు. ప్రతిమేకలో, వాడలో ఇంతే! వాకిళ్ల దగ్గర నించున్నారు. పాటకు పరవశులై వింటున్నారు.

ఈ పాటను వేణు విన్నాడు. వేణుతల్లి విన్నది. వేణుకీ పాట మామూలు పాటగానే ఉంది. కాని, ఎవరో లాగి నట్టులేదు. వేణుతల్లికి వీథిగాయకుడు వెళ్ళిపోతూ అన్నమాటలు గుర్తుకు వచ్చాయి. ఏం జరగబోతోందో నని గుండెఝల్లుమంది.

మురళిమీద పాట లయ మారింది. పిల్లలు వీథుల్లో నుంచున్నారు. పెద్దలుకూడా మేల్కొన్నారు. పాట విన్నారు. అది వింటుంటే వాళ్ళకి తమాషాగా ఉంది.

'ఓహో! వెధవ మురళీ వాడూను. తెల్లారకముందే సాగించాడు. ఈసారి వెంటబడి పోవడానికి ఎలుకలు లేవుగా!' అన్నాడు మంగళరాయుడు మేడ పై అంతస్తులో పిట్టగోడవద్ద నించుని.

'అహ ఈసారి ఎలుకలు కాదండోయ్....కుక్కలు' అని పకపకనవ్వాడు ఒకపెద్ద.

'కుక్కలూ కాదండీ కాకులు. పొద్దున్నే కాదూ అంచేత కాకులే లెండి!' అన్నాడింకో పెద్ద పళ్లు ఇకిలిస్తూ.

'అసలు ఇవేవీ కావండీ! ఈ సారి వాడివెంట పోయే వేమిటో చెప్పనా?....ఊరపందులు!' అన్నాడింకో పెద్దమనిషి. అందరూ పకపకా నవ్వుకున్నారు. వడగళ్ళవాన కురిసినట్టయింది.

కాని, వీథిగాయకుని పాట విన్న పిల్లలు—

ఒకరివెంట ఒకరొకరూ
ఒకపువ్వుల దండవలే
బంగరు పట్నం బాలలు
బయలుదేరినారూ.

చిన్నారీ నడకలతో
చిట్టి పొట్టి మాటలతో
చేయిచేయి పైన వైచీ
చేరినారు వారూ.

మల్లెపూల వాసన వలె
చల్లగాలి వీచినటుల
తెల్లని నది పొంగినట్లు
పిల్ల లేగినారూ.

పాటకు తాళం వేస్తూ
పాటకు ఛిందులు తొక్కుతు

పాటకు పరుగులు పెడుతూ
పరవశులైనారూ.

మాయనెరగనీ బాలలు
మర్మమెరగనీ పాపలు
మమతపుట్టి వెళుతున్నా
మంచిమనసు వారూ.

ముందు వీథిగాయకుడు. ఆ వెనక బంగారుపట్నంలో పుట్టి పెరుగుతూన్న ప్రతి బాల బాలికా వెళుతున్నారు. రంగు దుస్తులు ధరించిన పాపలు కేరింతాలాడుతూ పోతున్నారు. రక రకాల రంగు పువ్వుల్ని తెప్పకట్టి ఏటి కెరటాలమీద వదిలితే, అది చరచరా సాగిపోతూంటే ఎలా ఉంటుంది! అలా ఉంది వీథిలో పిల్లల వరుస!

వీథిగాయకుని పాట వింటూ నవ్వుకున్న పెద్దలకు కాసే పటికిగాని తెలీలేదు. వీథిగాయకుడి వెంట పిల్లలు చిందులు వేస్తూ పోతున్నారని తెలిశాక వారిగుండెలు ఝల్లుమన్నాయి.

'వీళ్ళని ఎక్కడికి తీసుకుపోతున్నాడు?' మంగళరాయుడి ముఖం నల్లబడిపోయింది.

'నది వేపే. అమ్మో! ఎలుకల్ని చంపినట్టే వీళ్ళనీ ముంచే స్తాడు కాబోలు!' పెద్ద అంటూనే నడుం బిగించి కనాలబడ్డాడు.

'కొంప మునిగిందిరోయ్! లేవండి! లేవండి!' అంటూ మంగళరాయుడు వీథిలో పడ్డాడు. అతని వెనక పెద్దలు.



'అతని కివ్వవలసిన వెయ్యివరహాలు ఇస్తామని చెప్పండిరా బాబూ!' కేకేస్తున్నాడు మంగళరాయుడు.

'పిల్లలు! మనపిల్లలు! ఏం కాను?' కంటికి కడవెడుగా కన్నీళ్ళు పెడుతున్నారు పెద్దలు.

పెద్దలందరూ లావుపాటి మనుషులు. అంపులోనూ గుండె చెదిరిపోయింది. ఎంత సాచి అడుగులు వేసినా పిల్లల్ని కలుసుకోలేకపోతున్నారు. ఈ అడావుడికి ఇళ్ళల్లోంచి మనుషులు లేచి వస్తున్నారు. వాళ్ళకీ విషయం తెలిసి గందరగోళమై కాళ్ళు విరగవొక్కుకుని బయలుదేరుతున్నారు.

కాని, ఆనందంతో ఉరుకులు పరుగులమీద వెళుతున్నారు వీథిగాయకుడూ, పిల్లలూను.

రోజుతూ రొప్పుతూ ఏడుస్తూ కళ్లు బయర్లు కమ్మి గుండె జారి ఈలగిలబడి పోతున్నారు పెద్దలు! వీళ్లు వాళ్ళని అందుకోగలరా?

'ఎవరైనా పరిగెత్తండి తండ్రీ! వీథిగాయకుడితో చెప్పండి. పరిగెత్తండి! చెప్పండి! పదివేలవరహాలు ఇస్తానని చెప్పండి. కాదు....ఇరవై....యాభై....' ఆపైన మంగళరాయుడికి మాట పెగల్లేదు. ఎవరూ పరుగెత్తనూ లేదు. ఎవరికి వారే శవప్రాయులై పోయారు.

కాని, పిల్లలు తరతమ భేదాలు లేకుండా కలిసిపోయారు. వాళ్ళ కన్నులముందు ఒక వింతలోకం కనిపిస్తోంది. వాన్ని చూసినట్టే భావిస్తున్నారు. ఆనందిస్తున్నారు. ఈ ఆనందాన్ని ఇస్తున్నది వీథిగాయకుడు. అతడొక్కడే తమకు దిక్కుగా తలిచారు.

దోవలో వేణు కలిశాడు. మంగళరాయుడి కొడుకు ఇప్పుడు వేణుని ఛీత్కరించలేదు. పరుగునవెళ్ళి కావలించుకున్నాడు. నిర్మలంగా నవ్వాడు.

'ఆహా! మన వీధిగాయకుడివంటి గొప్పవాడు ఈ ప్రపంచంలో లేడు వేణూ! అద్భుతమైన మనిషి! ఓహోహో!' అన్నాడు మంగళరాయుడి కొడుకు.



వేణు తోటి పిల్లలతో పాటు ఉరుకులు పరుగులు తీయ లేక పోతున్నాడు. కుంటివాడు కదా మరి! వీధి గాయకుని పాట పిల్లలందర్నీ ఉరికిస్తోంది.

వీధిగాయకుడు నది వొడ్డుకు చేరాడు. పిల్లలూ చేరారు. నది బ్రహ్మాండంగా ప్రవహిస్తోంది. కెరటాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి. ఒక్క నిమిషం! పిల్లలు నదిలో....

కాని, అలా జరగలేదు. [illegible]దు కూడా.

వీథిగాయకుడు పాటని మార్చాడు. మురళిని నది వేపు వంచలేదు. వంతెన పదికి మరలాడు. పిల్లలు నదివొడ్డునించి వంతెనమీదకు పరుగుతీశారు. ఎదురుగా పెద్దకొండ ! బంగారు కొండ !

పెద్దలప్పటికి దగ్గరదగ్గరగా వచ్చారు.

'అమ్మయ్య ! నదినించి తప్పుకొన్నారు వాళ్ళు. వాడు కొండమీంచి తీసుకుపోయేట్టు ఉన్నాడు !' అన్నాడో పెద్ద.

'ఐతే ! చాలమంచిది ! పదండి ! పరుగెత్తండి. వాడు కొండన్ను దాటించేలోగా పట్టుకొందాం ! పదండి !' అన్నాడు మంగళరాయుడు. తమ యావత్‌శక్తినీ కేంద్రీకరించి పెద్దలు ముందుకు దూకారు.

వేణు వెనుకబడిపోయాడు. తోటిపిల్లలతోపాటు గెంత లేకపోయాడు. పరుగులు తీయలేకపోయాడు. తనది కుంటికాలు. ముందు బంగారుకొండ! ఆ కొండ ఎక్కడం తనవల్ల కానేకాదు! 'అయ్యో!' అని నిట్టూర్చాడు. కొండ అంచునే దిగబడిపోతున్నాడు.

వీథిగాయకుడూ పిల్లలూ కొండరాళ్లమీద లేళ్ళవలే గెంతుతున్నారు. అతని మంత్ర మురళీగానం కొండమీద ప్రతి ధ్వనిస్తోంది.

ముందు వీథిగాయకుడు, ఆ వెనక పిల్లలు.

కొద్దిగజాల వెనక వేణు.

ఆ వెనక పట్నం పెద్దలు, ప్రజలూను. గజాలదూరమే!... ఇంతలో ఎదురుగా పెద్దరాతి తలుపు తెరుచుకొంది. ఓ.

ఎందరో వస్తాదులు కలిసి నెట్టేసినట్టు తెరుచుకొంది. ధనధనమని కొండ మారుమోగింది. చీకటి ! కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి గుహ !

వీథిగాయకుని మంత్ర మురళి పాడుతూనే ఉంది.

బంగారు పట్నంలోని బాలబాలికలందరినీ వీథిగాయకుడు చీకటి గుహలోకి తీసుకుపోయాడు. కాని ఒక్కడే దిగబడి పోయాడు !

'కాస్త, ఆగండి !' అని అరిచాడు వేణు. కాని ఆగ లేదు. బ్రహ్మాండమైన రాతితలుపు మూసుకుపోయింది.

అంతే- ఆ చీకటి గుహలో ప్రవేశించిన వీథిగాయకుడు గాని, వేలాది బంగారుపట్నం బాలబాలికలుగాని ఏమయ్యారో ఎవరికీ తెలీదు ! బహుశా ఏ నాటికి తెలియకపోవచ్చు. కాని, ఒక విషయం మాత్రం నిజం ! వీథిగాయకుడు ఆ పిల్లలకోసం మరో కొత్తలోకాన్ని సృష్టించే ఉంటాడు! ఈ మాట ఎవరూ నమ్మకపోవచ్చు. పిల్లలపట్ల అమితానురాగాలు గల వీథిగాయకుడు మరోవిధంగా చెయ్యడు ! ఐతే మరోప్రశ్న వేయవచ్చు. వీథిగాయకుడికి వేణు అంటే చాలఇష్టం కదా ! మరి అతన్ని ఎందుకు తీసుకుపోలేదు ? అని అడగవచ్చు. నిజమే ! ఈ కథ పూర్తిగా వినండి....మీ ప్రశ్నకు జవాబు దొరుకుతుంది !

రాతితలుపు ముందు వేణు దిగాలుపడి నించున్నాడు. పట్నం పెద్దలు ప్రజలు వచ్చారు. కాని ఏముంది ? రాతి తలుపు.

వేణుకి తను వాళ్ళతోపాటే వెళ్ళలేకపోయాను గదా ! అని దిగులు. పెద్దలతో ఇలా చెప్పాడు :

'వాళ్ళంతా ఇదే, ఈ గుహాలోంచే వెళ్ళిపోయారు. వాళ్ళ కక్కడ అద్భుతమైన ప్రపంచం ఉంది. వాళ్ళంతా హాయిగా నిర్మలంగా కలకాలం అక్కడే ఆడుకుంటారు. పాడుకుంటారు. ఆనందాన్ని అనుభవిస్తారు. ముమ్మాటికీ నిజం ! అభాగ్యుణ్ణి. నేను వాళ్ళతోపాటే వెళ్ళలేకపోయాను. కుంటివాణ్ణి కాబట్టి కదా ఒంటరిగా దిగబడిపోయాను. అయ్యో ! ఆ అందాల ప్రపంచం చూసే భాగ్యం నాకు లేదు కదా !' అంటూ వేణు కన్నీరు కారుస్తూ చెప్పాడు.

గుహ తలుపు మరిరాదని నిర్ణయించిన తర్వాత ఇక ఆ పెద్దలూ ప్రజలూ పెట్టిన ఏడుపులు మొత్తుకోళ్ళు ఇన్నన్ని కావు. ఆకాశం దద్దరిల్లేట్లు విలపించారు. కొందరాడవాళ్ళు కరిగేలాగ గుండెలు బాదుకున్నారు. తలలు బాదుకున్నారు. కొందరు స్పృహతప్పి పడిపోయారు.

మంగళరాయుడి దుఃఖం వర్ణించడం చాలాకష్టం. ఒక్కగాను ఒక్కకొడుకు. తలుచుకొని తలుచుకొని కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నాడు. చతిమ్మా పెద్దలూ తమ సంతానం నిమిత్తం అలానే ఏడుస్తున్నారు. పిల్లల తల్లిదండ్రులు ఒకరినొకరు చూసుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు.

'వేణు, వేణూ !' గద్గదకంఠంతో అందరికన్నా వెనక నించి పిలిచింది వేణు తల్లి! తల్లి పిలుపు విని ముందుకు వెళ్ళాడు వేణు. తల్లీ కొడుకులు కౌగలించుకొన్నారు. ఇద్దరి నోటా మాట రాలేదు.

'నిన్ను విడిచి బతకలేను తండ్రీ! వాళ్ళతో వెళ్ళిపోలేక పోయానని దిగులుపడుతున్నావా బాబూ! వొద్దు వొద్దు నిన్ను విడిచి నేను....' తల్లిమాట పూర్తి కానీయకుండానే వేణు కళ్ళు తుడుచుకుంటూ 'నువు చెప్పింది నిజమమ్మా! కావాలనే నన్ను వదిలిపెట్టి వెళ్ళాడు. నువు నన్ను వదిలి ఉండలేవని తెలుసు. నీవంటే అతనికి చాలా నమ్మకం ఉంది. అతని గొప్పను గుర్తించింది నీవేగా! అందుకనే మనకు మేలు చేశాడు!' అన్నాడు.

ఆ పగలంతా కొండముందే పడిగాపులు పడి ప్రజలు ఏడ్చారు. ప్రార్థించారు. ఏం లాభం? ఏడ్చి ఏడ్చి ఆఖరికి నిరాశచేసుకుని ఇళ్ళకు బయల్దేరారు. ఆ వేళ తేదీ ఏమిటో తెలుసా? 28-6-1455!

కాని, పట్నమంతా ఖాళీ. ఎడారి. ఉప్పుసముద్రం శూన్యం. కాళ్ళకు అడ్డాలు పడే పాపలు లేరు. చేతులు పుచ్చుకుని సరసనే నడిచే పిల్లలు కానరారు. 'అమ్మా!' 'నాన్నా' అని పిలిచే ముద్దు పిలుపులు వినిపించవు. కన్నులపండువుగా ఆటలాడే బిడ్డలు ఏరీ? అల్లరిలో ఆనందం ఇచ్చే లబ్బాయిలు ఎక్కడ? చిట్టిపళ్ళాల్లో

గోటిముద్దలు తినడానికి మారాంచేసే బంగారు పాపలు ఏరీ? దీపం లేనియిల్లు. చంద్రుడు లేని రాత్రి, సూర్యుడు లేని పగలు, పాపలులేని బంగారు పట్నం ఒకటే. ప్రజలకు కనుమూసినా కనుతెరిచినా పాపలే కనుపిస్తున్నారు.

మంగళరాయుడి మూలాన్నే ఇదంతా జరిగిందని ఆడవాళ్లు తలిచారు. కడుపు మండింది. అగ్నిలాగా విజృంభించారు. వెనక ముందు చూడలేదు. బయల్దేరి వెళ్ళారు. అసలే సగం చచ్చిపడి ఉన్న మంగళరాయుడిని చుట్టుముట్టారు.

'ఆడితప్పావు. వీధిగాయకుణ్ణి అవమానించావు. నీ మూలాన్నే మా బిడ్డలందరూ మాయమయ్యారు. దుర్మార్గుడా! మా గర్భశోకం నీకెలా తెలుస్తుంది! నీకిదే శిక్ష!' అంటూ తలో రాయి విసిరారు.

వేణుతల్లి అడ్డంగా నిలిచి 'ఒక్క మంగళరాయుడిదే కాదీ తప్పు. మీ అందరిదీని. వీధిగాయకుణ్ణి అవమానించడంలో అందరికీ భాగం ఉంది. మీ రందరూ ఆనాడు నోరు మూసుకున్నారు. ఇవాళ విరుచుకుపడితే ఏం లాభం?' అని సర్దిచెప్పింది.

బంగారుపట్నం మొత్తమ్మీద ఒక్క కుర్రాడు, కుంటి వేణు మాత్రం మిగిలాడు. పశ్చాత్తాపంతో ప్రజలు బజారు మొగం చూడడంలేదు. వాకిళ్ళు ఊడ్చినవారే లేరు. అసలు తలుపులు తెరిచేవారుంటేనా? బెంగపడి మంచాన బడ్డారు.

వేణు ప్రతిరోజు ఉదయాన లేస్తాడు. ఉలీ సుత్తి పుచ్చుకుని బంగారుకొండ వద్దకు వెళతాడు. పగలల్లా అక్కడే ఉంటాడు. ఏం చేస్తున్నాడో ఏమో ఎవరికీ తెలియడంలేదు. పగలల్లా వేణు కనిపించకపోయేసరికి తల్లికి బెంగపట్టుకుంది.




అడిగితే వేణు నవ్వి ఊరుకునేవాడు. అంతే కాని విషయం చెప్పేవాడుకాదు.

ఒకరోజున తల్లి కూడా వేణు వెనకనే వెళ్ళింది. వేణు నదిపంతెన దాటి, కొండ గుహ ముందు కూచుని రాతిమీద చెక్కుతున్నాడు. తల్లి కేమీ అర్థం కాలేదు. దగ్గరగా వెళ్ళింది. తల్లిని చూసి వేణు ఆశ్చర్యపోయాడు.

'ఏమిటి నాయనా ఇది?' అనడిగింది తల్లి.

'ఇటురా అమ్మా చెబుతా' అని తల్లిని తీసుకునివెళ్ళి మొదటిరాతిని చూపించాడు. వీధిగాయకుని కథ మొదలుపెట్టి- ఉన్నది ఉన్నట్టు చెక్కి-ఉంది. అదంతా చదివి వినిపించాడు వేణు.

వేణుతల్లి ఆనందబాష్పాల్ని కురిపించింది.

ఆ తర్వాత చాలకాలం తల్లీకొడుకులు ఆ గుహముందే ఉండిపోయారు. ఆ ఇద్దరూ గుహాముఖాన ఉన్న రాతితలుపు మీద వీథిగాయకుని రూపచిత్రం చెక్కారు. చిత్రానికి రంగులు దిద్దారు.

మరి బంగారు పట్నం సంగతి? ఏమో ఏమైందో!

ఏమైపోయెను బంగరుపట్నం?
ఏమైపోయిరి పట్నం ప్రజలూ?
ఆడితప్పిరను అపయశమొకటే
నేడు నిలిచిపోయిందీ!

వీథిగాయకుని మోసగించిరీ
పిల్లల పాపల కోలుపోయిరీ
బంగరుపట్నం కోటీశ్వరులూ
ఫలితం ఏం జరిగిందీ?

బంగరుపట్నం ఊరు మాసెనూ
పట్నం ప్రజలూ పేరు మాసిరీ
లక్షలు కోట్లూ మట్టిలో కలిసెను
రక్షించదు ధనమెంతైనా.

కుంటివేణు, వేణుతల్లీ తమ జీవితాంతం ఆ గుహముందే గడిపి ఉంటారు. బహుశా పాడుపడిన పట్నంవేపే వెళ్ళి ఉండరు. పట్నం ప్రజలుకూడా నదివేపు వచ్చి ఉండరు.

*　　　　*　　　　*

ఐదువందల ఏళ్ళు గడిచాక ఇప్పుడు వీథిగాయకుని కథ బంగారుకొండ మూలంగా బయటపడింది. మీలో ఎవరైనా బంగారుకొండ చూడాలనుకుంటున్నారా ? తప్పకుండా చూడండి! దాని దోవ చెబుతాను. కాని మీ రక్కడ ఈ కథని రాళ్ళమీద చదవాలనుకుంటే మాత్రం ముందుగా పిల్లలభాష, లిపి నేర్చుకోండి. అవి రాందే లాభంలేదు.

ఒక్క షరతు. ఆ రాతిద్వారాన్ని తెరవాలనికాని, ఆ గుహలో బంగారుపట్నం పాపల ప్రపంచం చూడాలని కాని ప్రయత్నించకండి. వొద్దు. ఏ నాటికైనా వీథిగాయకుడే వచ్చి పిలిస్తే మాత్రం అందరమూ వెళదాం !

ఓ వీథిగాయకా !
అమరగాయకా, జోహార్ !
మనసిచ్చినవారికెల్ల
మనసిచ్చితి వో గాయక !
జాలిచూపి పేదలపై
మేలు చేసినావయ్యా !

ఆడితప్పె కోటీశ్వరు
లంఘులు లవమ్మానిస్తే
తిరుగులేని గుణపాఠం
తెలియచెప్పినావయ్యా !

—: ० :—